శ్రీ

# సో హ్రా బు.

మాథ్యూ ఆర్నాల్డు " అను హూణమహాకవి రచించిన

'సోహ్రాబు & రుస్తుము'

అను పద్యకావ్యమునకు భాషాంతరీకరణము.

మోచెర్ల హనుమంతరాయనిచే రచితము.

మొదటికూర్పు 500.

కాకినాడ:

సిటీ ప్రెస్ వారిచే ముద్రితము.

1919.

ఈ పుస్తకము

కీర్తిశేషులైన నా తండ్రిగారగు

మోచెర్ల రామచంద్రరావుగారికి

ప్రేమపూర్వకముగా

సంకిత మొనర్పఁ బడియె.

# Foreword.

FOR the last quarter of a century there has been working amidst us a literary movement, which is responsible for the hundreds and thousands of Telugu books that have been issued from the press year after year. It is true all these volumes will not stand the test of time. There are books which will even remain a permanent asset of the Telugu literature; and there are other books also, which will not be heard of, except perhaps in elaborate histories of literature, a quarter of a century hence. But apart from the intrinsic worth of these productions each one of them has had and will have, for sometime to come, a function—an important function—with reference to the *general evolution* of the literature of the Andhra Country.

ONE common feature of the Telugu books published in recent years is that they reveal a frank and free tendency to combine Eastern thought and Telugu language with Western models. This is an excellent tendency—even though it is complained in some quarters that the tendency is a little overdoing itself—for no literature can progress unless it is free to give and free to take.

Mr. Hanumanta Rao's "Sohrab" is a product of the new movement and it avowedly shows the tendency referred to above, as it is a translation. No translation has ever been looked upon as a great work, except it be the Andhra Mahabharata. But translations in the Andhra Country, at the present epoch of the history of her literature, are of no little value. An author who can borrow and yet render what he has borrowed far more beautiful than the original, is a man of genius. Next to him, in my opinion, does a plain, open translator of a good book do the greatest service to the literature of his country. He places within the reach of his fellow workers, some of whom know no language but their own mother tongue, the thoughts and literary methods of the authors of other countries. And it is not too much to hope that a clever translation may be the means of stimulating into life the dorment intellectual powers of a real literary genius. I beg leave to add that Mr. Hanumanta Rao's "Sohrab" is a good translation of a good poem. I congratulate him.

Rajahmundry
Innispeta,

J GANGANNAH, B.A., L.T.,
Head Master,
*Viresalingam's High School.*

# OPINIONS.

**M. R. Ry. Kuchi Narasimham Garu B. A.,**
*Head Master, R. Ch. High School,*
**PITHAPURAM.**

"Many thanks for the copy of your metrical version of Arnold's "Sohrab and Rustum" in Telugu.

I have read many portions of the work and am very pleased with it.

The flow is smooth and unlaboured and the language, simple and chaste. The choice of metre is also very appropriate.

There are very few books among the present day publications written without violating the genius and idiom of our sweet vernacular; but yours, I am glad to say, is one of those few and *well deserves to be put into the hands of the High School boys as a text book for profitable study.*

* * * * *

M. R. Ry.
**Sree Rajah M. Bhujangarao Bahadur Garu,**
*Zamindar of Lakkavaram, Vella etc.,*
**ELLORE.**

తమ "మాత్యూఆర్నాల్డు" అను హూణమహాకవిచే రచియింపఁ బడిన "సోహ్రాబు అండు రుస్తుము" అను ఆంగ్లేయ పద్యకావ్యమునకు

భాషాంతరీకరణమగు "సోహ్రాబు" ను సాంతముగాఁ జదివితిని. ఈగ్రంధమున నందందు "నదీతటంబునయందు" అను మొదలయిన చక్కని భారతప్రయోగములు శ్రవణానందమును గావించినవి.

"ఆంధ్రీకరణ మెంతవఱకు సమంజసముగా నున్నదోయని యాంగ్లేయ గ్రంధమును దగ్గఱ నిడుకొని కొన్నితావులు పోల్చిచూడఁగా సరియైన భాషాంతరీకరణమని నాకుఁ దోఁచినది.

"మొదటినుండి చివరవఱకు శైలియందు భేదమింతయును గానరాకుండునట్లు చక్కఁగా నాంధ్రీకరింపఁబడినది. ఆంగ్లేయగ్రంధము లోకమందెంత ప్రఖ్యాతిని వహించియున్నదో దాని యాంధ్రీకరణమగు నియ్యదియు నంత ప్రఖ్యాతి నొందఁగలదని నుడువుచుంటిని.

"ఈగ్రంధమును దండిగ్రాగారి కంకితమొనర్చుట కధాంశముం బట్టి మిగుల నుత్తమమయిన పనిగా నెన్నుచుంటిని.

"చ. ప్రబల కవిప్రయోగ సమ భావురసద్గుణ జాలపూరిత
స్తబకము లై, యశేషజన సమ్మతమార్గ దృఢీకృతంబు లై
యుబుకురసంబు నీకృతుల నొప్పఁగనంచు వచించుఁజాల "సో
హ్రాబు" హనుమంతరాయ! యనయంబు రచింపుము నవ్యకావ్యముల్"

---

## M. R. Ry. Attili Suryanarayana Garu,

*Vernacular Superintendant, P. R. College,*

**COCANADA.**

"ఆంగ్ల మహాకవియైన 'మేథ్యూ ఆర్నోల్డు' చే రచింపఁబడి నుప్రసిద్ధి నందిన 'సోహ్రాబు—రుస్తుము' అను పద్యకావ్యరత్నమును లలితగతి నాంధ్రీకరించి, శ్రీ మోచర్ల హనుమంతరావు పంతులుగారు ఆంధ్రభాషా

ఘోష కేయూరాభరణమును సమకూర్చి, యాంగ్లప్రపంచ కృతజ్ఞతకుఁ బాత్రులైనందున కొంతయు నభినందించుచున్నాను. ఇందలి శైలి జాతీయమై, ధారాళమై, యొప్పారుచున్నది. రసవంతములైన యిట్టి యుత్కృష్ట నూతన కావ్యములు విద్యార్థుల హస్తముల నలంకరింప నర్హములనుట నిస్సందేహము ".

---

## M. R. Ry. G. Jagannatha Swami Garu, M.A., L.T.,

*Head Master, P. R. College,*

**COCANADA.**

"తమరు దయతోఁ బంపిన "సోహ్రాబు" అను పద్యకావ్యమును జదివి సంతసించితిని. భాషాంతరీకరణమున భాషాసంప్రదాయానుకూలములగు మార్పు లందందుండుటచేఁ దమకృతి మాతృకానుసారి కాకున్నను మాతృకానుకారి యని చెప్పనొప్పు. మాతృకకంటె న్యూనాధిక్యములు రసపోషణమునకై యుండఁబోలు.

శైలి చక్కనిది; రచనమృదులము; ప్రయోగములు జాతీయములు; రసము ప్రచురముగనున్నది. పాదగమనము సమయానుకూలముగనే యున్నది. కవిత్వము తీవవలెసాగి గతిభేదములకు సాయపడినది. భాష మాతృకయందువలె మిగుల సులభము కాక, కొంత ప్రౌఢిమను స్పృశించుచున్నది. మొత్తముపై సరసమై రమణీయమై యున్నదని వ్రాయుట కెంతయు సంతసించుచున్నాను.

**M. R. Ry. Jayanti Ramayya Pantulu Garu B.A., B.L.,**
*(Retired Deputy Collector)*
*President, Telugu Academy,*
**MADRAS.**

"I thank you for the copy of the "Sohrab" I have gone through it and think that *it is well done. The style is easy* and *flowing.*"

---

# ఆంధ్రపత్రిక.

కాళయుక్తి సం॥ పౌష శు ౫ మంగళవారము (6-1-1919) 'మోచెర్ల హనుమంతరావు గారిచే రచింపఁబడిన "సోహ్రాబు" అను పద్యకావ్యము మా కార్యాలయము చేరినది. ఇది "మాత్యూ ఆర్నాల్డు" అను ఇంగ్లకవిచే రచియింపఁబడిన "సోహ్రాబు అండు రుస్తుము" అను గ్రంథమునకు భాషాంతరీకరణము. .........గ్రంథము భాషాంతరీకరణమువలెఁ గాక యుండురీతిని చక్కని శైలిని వ్రాయఁబడినది. కవిత్వము మిగుల రసవంతముగను ధారాళముగను ఉన్నది. భావప్రకటన మఱియు క్రమముగఁ జేయఁబడినది. ఇట్టి శైలితో నీకవి యింక స్వకపోల కల్పితగ్రంథములను రచించునని విశ్వసించుచున్నారము".

# పీ ఠి క.

ఈపద్యకావ్యము హూణభాషలో "మాత్యూ ఆర్నాల్డు" (Matthew Arnold) అను కవి రచించిన "సోహ్రాబు & రుస్తుము" (Sohrab and Rustum) అను కావ్యమున కాంధ్రీకరణము. 'ఆర్నాల్డు' కవి తన కావ్యము 'పెరిషియా' దేశ కవీశ్వరుఁ డైన 'ఫిర్దుషీ' యను నతని 'షానామా' యను రాజులచరిత్రము నుండి గ్రహించి చమత్కరించి వ్రాసెను. ఈ య్యార్నాల్డుకవి డాక్టరు థామస్ ఆర్నాల్డుగారి కుమారుఁడు. ఇతఁడు తండ్రి యొద్దను 'ఆక్సుఫోర్డు' (Oxford) కాలేజీయందును విద్యాభ్యాస మొనరించెను. 1828 సం॥ జనియించెను. ఈకవి రోముదేశములోఁ జరిత్రకారుఁ డై యుండి యక్కడి పాఠశాలయందే ప్రధానోపాధ్యాయపదవి నలంకరించెను. 1851 సంవత్సరమునఁ బాఠశాలాముఖ్యపరీక్షాధికారము వహించి 1886 సంవత్సరమువఱకుఁ బని చేసి యుద్యోగము చాలించుకొనియెను. 1888 సంవత్సరమున మరణము నొందెను. ఈయన శైలి యాంగ్లేయభాషలో మిగుల ధారాళమై సులభమై యుపమానోపమేయములకును స్వభావోక్తులకును సాటి పట్టయి చెలువారుచున్నది. ఈగ్రంథము నేను బలుమారు చదివి యిట్టి యుత్తమకావ్యము నాంధ్రీకరించినఁ గొంతవఱ కాంధ్రుల కుపయుక్తముగా నుండునని తలంచి సాధ్యమయినంతవఱకు మాతృక ననుసరించియే వ్రాసితిని. రసపోషణార్థమై మాతృకాభిప్రాయములకు విరుద్ధములు కాని యల్పభేదములు కల్పింపవలసి వచ్చినది. అన్యభాషలోని కావ్య మాంధ్రీకరించి మాతృకయందలి రసభావములను బ్రకటన చేయుట యెంతయుఁ గష్టమని చెప్పవచ్చును. అయినను బ్రయత్నించి వలనయినంతవఱకు భాషాంతరీకరణమూలను

జేయుట యాంధ్రభాషాభివృద్ధికి మూలమని నిశ్చయించి నేను దీనికిఁ బూనితిని. ఇందలి గుణలేశములనే గ్రహించి రసజ్ఞులు నాకుఁ బ్రోత్సాహము సంగుదురు గాక !

కథాంశము తెల్లముగాఁ దెలియుటకై యిందలి కథ సంగ్రహముగా నిందుఁ బొందుపఱచితిని.

కాకినాడ,
28-12-19.

గ్రంథకర్త.



# కథాసంగ్రహము.

'రుస్తుము' అను శూరుఁడు తన భార్య గర్భవతిగానుండు కాలమున యుద్ధమునకుఁ బోనెంచి యొకముద్రిక నామె కిచ్చి శిశువు పుట్టఁగానే భుజముమీఁద వేయుమని చెప్పి పోయెను. కొంతకాలమున కతని కొక కుమారుఁడు పుట్టెను. భర్త చెప్పినప్రకారము భార్య కొడుకు భుజముమీఁద ముద్ర వేసెను. కొడుకు పుట్టినవార్త మగనికిఁ దెల్పినచో నతఁడు పెద్దవాఁడైనపిమ్మట యుద్ధములకుఁ దీసికొనిపోవునేమో యని భయపడి కూఁతురు పుట్టినదని వార్త నంపించెను.

కొడుకు పెద్దవాఁడై తండ్రివలెనే మహాశూరుఁ డయ్యెను. అతని పేరే 'సోహ్రాబు.' ఒకనాఁ డీతఁడు తన తండ్రిని గూర్చి తల్లి నడుగఁగా నామె గతవృత్తాంతమును జెప్పెను. అంత సోహ్రాబు తార్తారుసేనలో ముఖ్యశూరుఁడుగాఁ బ్రవేశించి దండయాత్రలు చేయుచు గొప్ప శూరుఁడైన తన తండ్రిని గనుఁగొనుట కనేక విధములఁ బ్రయత్నించుచు నాతఁడు పారసీక సైన్యములో నున్నవాఁడని విని సంతోషించి తన జనకుఁడు తక్క నితరులు తనతో సమానులు లేరనియు వచ్చినఁ దండ్రియే వచ్చుననియుఁ దలంచి 'సోహ్రాబ్' ద్వంద్వయుద్ధము ప్రకటించెను.

'సోహ్రాబు' తలంచినట్లుగా 'రుస్తుమే' యుద్ధము చేయుటకు వచ్చెను. కాని మాఱువేషముతో 'రుస్తు' మని తెలియకుండ వచ్చెను. 'సోహ్రా' బతనిం గనిపెట్టలేక యొకింత తడవు చూచుచుండెను. 'రుస్తుము' కూడ నొకవిధమైన వాత్సల్యము కలిగి యతనితో యుద్ధము చేయుట కిష్టములేక నిల్చియుండెను. క్రమక్రమముగా వా రిరువురికిని మాటలు పెరిఁగి యుద్ధ

మయ్యెను. అందు 'సోహ్రాబు' గెలిచెను గాని గాయపడెను. 'సోహ్రాబు' తన కొడుకని యెట్టకేలకు 'రుస్తుము' తెలిసికొని చేతులారఁ గుమారుని జంపుకొనినందులకు దుఃఖించెను. అతివిచారకరమైన సంభాషణము తండ్రి కొడుకులకు జరిగెను. పిమ్మట 'సోహ్రాబు' మృతినొందెను. ఇది వినినవారెల్లఁ గన్నుల నీరు నించిరి.

---

# ఈ కావ్యమందలి పాత్రాదులు.

ఆక్ససు (Oxus)—ఇది 'ఆరల్' సముద్రములోనికిఁ బ్రవహించుచున్న యొక నది.

సామరఖండు—తురుష్క స్థానములోని యొక పట్టణము.

శైస్థాను—పెరిషియా దేశమునందలి తూర్పుభాగము. ఇది హెల్మండునకు దగ్గఱగా నున్నది.

హెల్మండు—ఆఫ్ఘనిస్థానమునందలి నది.

సోహ్రాబు—రుస్తుము కొడుకు.

రుస్తుము—పారసీకసైన్యమందలి మహాశూరుఁడు. సోహ్రాబు తండ్రి.

గుదుర్జ—పారసీక సహాయ సేనాధిపతి.

పెగనువీజ—తార్తారుల సేనాధిపతి.

గుర్దు—రుస్తుము మామగారు. సోహ్రాబు తాత.

*N. B.*—11 వ పుటలోని 212 వ బంతి "దాఁటి చనిచని కొండొక సమతలమున" అను దానిని "దాఁటి చనిచని యొకసమతలమునందు" అని చదువుకొనునది.

---



# సోహ్రాబు

ఉదయరాగంబు తూర్పున ♦ నుద్భవింప
నాక్ససు మహాఝరీ ప్రవా ♦ హంబునుండి
వెడలెఁ బొగమంచు; తార్తారు ♦ లొడలునుఱచి
శిబిరమున నిద్ర యింకను ♦ జెందుచుండ.
రాత్రియరితయు నిద్దుర ♦ రాక, కనులు
విచ్చిచూచుచు మదిలోన ♦ పెక్కువగల
శయ్యఁబొరలుచు యోజన ♦ ల్సలుపుచుండి
యుదయమౌటను గనుఁగొని ♦ యుదరిపడుచు
లేచి నాలుగు వలఁకులఁ ♦ జూచిసుంత
నతిసితకృపాణి మొలకు వ్రే ♦ లాడఁగట్టి
యుక్కుమీఱంగ నామంచు ♦ లెక్కగొనక
"సోహ్రబు" బిడాన నరుగంగఁ ♦ జొచ్చెఁ "బెరను
వీజ" వసియించు సీమకు ♦ వెదకికొనుచు.
ఆఝరీతీరమున గ్రీష్మ ♦ మందు నలరు
తేనెపెరలును బలె నెన ♦ లేని సొబగు
నించు నల్లని పేరాల ♦ నిర్గమించి

యరసె నొకచోట నున్నతం ◆ బైనగుట్ట.
దానిపైఁ బూర్వమేనాఁడొ ◆ తనరె నొక్క-
మంటిదుర్గము, నేఁడది ◆ మట్టియగుటఁ
‘బెరనుబీజ’ వసింపఁగ ◆ వేశ్మ మచట
వేయఁబడి యుండె, నద్దాన ◆ వింతగులుకు
రత్నకంబళ్ళ పఱచిరి ◆ రామణీయ
కమున కిది యాటపట్టను ◆ కరణి, నందు
‘సోహ్రా’ బతిమందగమనుఁడై ◆ చొచ్చుచుండ
ముసలి దళవాయి యాయుధం ◆ బులనుదనకుఁ
బ్రక్కనిడుకొని వచ్చియు ◆ రాని నిదురఁ
గాంచుచుండుట నెవఁడొదో ◆ తెంచులీల
నంతలోననె కనిపెట్టి ◆ హస్తమాని
కొని చివాలున లేచి యి ◆ ట్లనియె నపుడు.
“ఎవ్వఁడవునీవు ? రానేల ◆ యిచటి ? కుడయ
మైనఁ గాకుండ, వార్తలే ◆ మైనఁ గలవె ?”
అనిన ‘సోహ్రాబు’ వానికి ◆ ననియె నిటులు,
“ఎఱుఁగవే నన్ను సోహ్రాబు ◆ నేఁ బరుండఁ
గాను, ఖరకరుఁ డింకను ◆ గానరాఁడు
వైరివర్గమాక్ససు నదీ ◆ తీరభూమి
నొడలెఱుంగక నిద్రించు ◆ చుండెఁ, నాకుఁ

గన్నులకు నిద్రరాదయ్యె ♦ నెన్నియేని
గతుల యోజించుచుంటి సం ♦ గరముఁగూర్చి
చేరవచ్చితి నిన్ను ద ♦ ర్శించు కొఱకు.
మన నృపాలుఁడు నాతోడ ♦ ననియె మున్ను
"ప్రేమతోఁ జూచుఁ 'బీరను ♦ వీజ' నిన్నుఁ
దండ్రిగతినెన్నుచుండు మా ♦ తనినెడంద"
యనుచుఁ గావున నోతండ్రి! ♦ యస్మదీయ
వాంఛితము నేఁడు వెలిపుచ్చ ♦ వచ్చినాఁడ
నింతకాలంబు నృపుచిత్త ♦ మెఱిఁగిరిపులు
భయసమాకులచిత్తులై ♦ పరుగులెత్తఁ
జేవయునులావు మెఱయించి ♦ యేవిధమున
బాల్యముననుండి సంగరా ♦ వనిఁజరించి
యుంటినో నీవెఱుంగుదు ♦ వొకటికాదు
వేయిసారులు పారసీ ♦ వీరవరుల
గెలిచి శౌర్యంబుఁజూపి కై ♦ క్కొములనెత్తి
స్వామిభక్తిని జూపుచు ♦ సంగరముల
నెవని నారయుచుందునో ♦ మెఱిఁగియుంటి.
అట్టి 'రుస్తుము' నాతండ్రి ♦ యఖిలశూర
భూషణంబే మహారణం ♦ బునసో నాకుఁ
గనులపండువుసేసి లో ♦ క ప్రసిద్ధ

వీరుఁ దనపుత్రు నినుఁగాంచి ♦ ప్రేమతోడఁ
పిలిచి కౌఁగిటఁ జేరిచి ♦ యలరఁ జేయు
ననుచుఁ దలపోయుచుందునే ♦ నహరహంబుఁ
గానియంతటి భాగ్యంబు ♦ కలుగదయ్యె.
అయ్యిన నేమాయె నేనిప్పు ♦ డడుగుకోర్కె
సఫలమొనరింపు, ముభయ ప ♦ క్షములఁ గూడ
నేఁటికని మాన్పి విశ్రాంతి ♦ నెగడనిమ్ము.
ఎదిరిబలములనుండి బ ♦ లిదునినొకనిఁ
బిలిచి నాతోడఁ బోరాడ ♦ పలయుననుము.
విజయమునుగాంతునేని తా ♦ విని మదీయ
జనకుఁ డానందసాగరం ♦ బున మునుంగు,
నట్లుగాకేను సంగ్రామ ♦ హతుఁడనగుదు
నేని యొకసారి నాయాస ♦ లెల్లఁ దీఱు.
జగమునం దెందఱెందఱు ♦ సమరసీమ
నిహతులగుచుండు టరయమా ♦ నిహతులయిన
వారిలో వీరువారను ♦ పేరుకలదె?
వీరుఁడై నట్టివాఁడాత్మ ♦ విక్రమంబు
నొంటిపోరునఁ జూపుట ♦ యొప్పుఁగాని
మూఁకతోఁ గూడి పోరాడి ♦ వీఁకమెఱయఁ
జేయు నేర్పునె? సత్కీర్తిఁ ♦ జెందఁగలఁడె?

హాత్రసూరునకుఁ బ్రపం ♦ చమున బంధు
జాతమదియేల ? యాశా పి ♦ శాచియేల ?
కులలో నొక్క ♦ వీరవరుని
గదిసిపోరాడు నాబుద్ధి ♦ గారవించి
వనంపుము పడినన్న ♦ వీరునొకని"
అనుడుఁ 'బీరనువీజ' సో ♦ హ్రాబునుజూచి
రంబున నతని హ ♦ స్తముఁదెమల్చి
దీర్ఘనిశ్వాస మొనరించి ♦ ధీరహృదయుఁ
చు నిలిచిన యాతని ♦ యాననంబు
వంకఁ దనచూడ్కి నిగిడించి ♦ పలికె నిట్లు.
హృదయమునకు రవంతయుఁ ♦ గుదురుబాటు
లేకయుంటివి సోహ్రాబ ! ♦ నీకుఁదగునె ?
ద్వయుద్ధము సేయంగఁ ♦ దలఁపుఁ గొనుట
నిన్ను విడనాడి మేముండ ♦ నేర్తుమొక్క !
లమగు మమ్ముఁగూడి వి ♦ శ్రాంతిఁబడసి
యిందయుండుము ద్వంద్వయు ♦ ద్ధేచ్ఛవిడిచి.
ఁడునుజూచి యెఱుఁగని ♦ కన్నతండ్రి
నరయుకోర్కినపాయదం ♦ బయినయొంటి
రుసేయంగఁ దలఁచుట ♦ పోలునయ్య ?
జనకసందర్శనాపేక్ష ♦ ఘనమయేని

గాంచు మాతని వేఱొక్క • కరణిఁ, గాని
సమరముఖమునఁ జూడంగఁ • జనదు నీకు.
నీవు చల్లఁగనుండి తం • డ్రిని గనంగ
సంభవించునయేని యా • శౌర్యరాశి
యక్కునం జేర్చికొను నిన్ను • నాదరమునఁ.
గాన మానుము ప్రకృతసం • గ్రామవాంఛ
బాల్యమున నేను రుస్తుము • బహుళ సమర
కౌతుకంబున నొప్పారు • కాలమందుఁ
గాంచితిని వాని శూరత్వ • గరిమ మతఁడు
జయముఁ గాంచుటె కా కప • జయముఁ గనుటఁ
గనియు వినియు నెఱుంగ మె • క్కడను గాని.
పారసీకులలోన నా • శూరరత్న
మగపడుటలేదు తొల్లిఁటి • యట్టు లిపుడు
పండ్లుపైఁబడ వార్థక • మేగుదేర
శస్త్రవిద్యకు నొకనమ • స్కార మనెనొ !
ప్రభునితోడ వివాదంబు • ప్రబలి యనికి
రాకమానెనొ ! యేమొ ! కా • గణ మెఱుంగ,
నిపుడు రుస్తుము తనతండ్రి • వృద్ధుఁడగుట
నతనిఁ గనిపెట్టుకొనియుండె • ననుట నిజము.
పొమ్ము నీవచ్చటికి—నేల • పోననంగ ?

మనసు శంకించుచున్న దే ♦ మనఁగ నేస్తు?
'నీకు నశుభంబు కలుగుట ♦ నిక్కువంబు
పోకుమో సోహ్రాబా !' యుద్ధ ♦ భూమి నిలువ.
కుశలివై నీవు సుఖయింపఁ ♦ గోరుచుందు
మమ్ము వీడిన — నెందున్న ♦ సమ్మదమునఁ
దండ్రిఁ గనఁబొమ్ము మల్లయు ♦ ద్ధమ్ము విడిచి.
ఎలుకఁ దఱివేచి దానికై ♦ యుఱుకు సింహ
శాబకంబును నరికట్టఁ ♦ జాలు నెవఁడు?
శూరశేఖరుఁడైన రు ♦ స్తుముకుమారు
నాజ్ఞ పెట్టంగఁ జాలిన ♦ యట్టిఁడెవఁడు?
చనుము సోహ్రాబ! నీయిచ్ఛ ♦ ననుసరించి
సమ్మతించితి నీ యభీ ♦ ష్టమ్ముఁ దీర్ప."
అనుచు నాతని హస్తంబు ♦ నట్టె విడిచి
పాన్పు విడనాడి చలిబాధఁ ♦ బాపఁదగిన
యున్నిచొక్కాయి ధరియించి ♦ కొన్న పిదపఁ
బాదయుగమునఁ బాదుకా ♦ ద్వయముఁ దొడిగి
తెల్లని ముసుంగుచే నొడ ♦ లెల్లఁ గప్పి
రాజదండముఁ బూని క ♦ రంబునందు,
ఖాతఖడ్గంబు విడిచి, మ ♦ స్తకమునందుఁ
జర్మపుఁ గుళాయిఁ గయిసేసి ♦ సత్వరముగఁ

బటకుటీరంపుఁ దెఱమెత్తి ♦ ప్రాభవమున
నొక్క పరిచారిక దనవెంట ♦ నుండఁ బిలిచి
యరిగెఁ 'బీరనుబీజ' కా ♦ ర్యార్థియగుచు.
భాస్కరుఁడు మింటిపై కెగఁ ♦ బ్రాఁకి కిరణ
సముదయచ్ఛవిఁ బాగమంచు ♦ నదమదంబుఁ
జేసె నాకస్సు సైకత ♦ సీమలందు
నంతఁ దార్తారు సైనికు ♦ లాత్మ శిబిర
ములను వెలువడి మైదాన ♦ మునను నిండి
రశ్వదళములతో నసం ♦ ఖ్యాకులగుచు
బారుదీఱిచి యాకాశ ♦ పథమునందు
గుంపుగుంపులుగాఁ బోవు ♦ కొంగలట్లు.
ఆకస్సు నదీతటంబున ♦ యందు డిగిన
రాజ రక్షకభటులు చ ♦ ర్మపుఁగుళాయ
లోఁ దలధరించి కుంతము ♦ లాది యుద్ధ
పరికరంబులఁ బూన్చి రు ♦ ద్భటభటాళి
సమరవాహంబు లెక్కి రు ♦ త్సాహ వశత.
ఇట్లు తార్తారు సైనికు ♦ లెసఁగుచుండఁ
బారసీక దళంబుల ♦ శ్వముల నెక్కి
కాల్బలంబులు వెనువెంటఁ ♦ గదలుచుండ,
మెఱపుమెఱసిన చందాన ♦ మెఱయుచు క్షాత్ర

ర్గముల్ఁ బూని విక్రమ ♦ క్రమమెలర్ప
యుద్ధ మొనరింప స్వాన ♦ న్నద్ధులైరి.
ంతఁ 'బీరనుపీజ' సై ♦ న్యములముందు
నిలిచి తార్తారువీరుల ♦ నిలువరించి
రాజదండంబుఁ జూపి వీ ♦ రభటకోటి
వెనుక కంపుటఁ గని 'పెరూ ♦ ద' నెడు పార
ంక సేనాని యీఁటెను ♦ జేతఁ బూని
దనబలంబుల ముందరఁ ♦ దాను నిలిచి
వెనుకతట్టిన కొక యంజ ♦ వేయఁజేయ
నుభయసైన్యంబులకు మధ్య ♦ నుండి 'పెరను
ంజ' వచియించె నిట్లు గం ♦ భీరలీల:—
"పారసీకవరూథినీ ♦ శ్వరవరేణ్య!
ంరభటులార! తార్తారు ♦ లార! వినుఁడు
నేఁటి కిరుదెస నాలంబు ♦ నిలువరింత
మొంటిపోరున నెదిరింప ♦ నోపు నొకఁ
జోదునెచ్చుఁడు మీలోన ♦ సోహ్రబతని
మారుకొన నున్నవాఁడు సం ♦ భ్రమముమీఁఱి."
అనుడుఁ దార్తారుసేనల ♦ యందు హర్ష
సంభ్రమంబులు పొదలెనా ♦ సమయమందు
నతనివాక్యములు ములుకుల ♦ యట్లు చెవుల

గుఱిచ్చుకొనఁ బారసీక వీ ♦ రులును జడిసి
యూపిరియుఁగూడ విడువకఁ ♦ యుండి రంతఁ
బోడివారలు మిగుల నా ♦ తురతఁబొంది
యా 'పెహూదును' జేరి కా ♦ ర్యంబు తెలుఁగఁ
గూర్చి తలపోయఁ జొచ్చిరి ♦ కొంతతడవు.
వారిలోన 'గుదుర్జ' య ♦ న్వాఁడు పలికె
నిట్టులు 'పెహూదు' తో నేఁడు ♦ చెట్టవుట్టె
మనల నవమాన దేవత ♦ యనుసరించె
ద్వంద్వయుద్ధము తప్ప దీ ♦ తరుణమందు
సోహ్రాబును గెల్చు నతిలోక ♦ శూరవరుఁడు
లేఁడు మనలోన నిక్కంబు ♦ లేఁడు లేఁడు
రణము మానిన నపకీర్తి ♦ వ్రణముఁబోలె
బాధ పెట్టెడు మనయోధ ♦ యోధములను.
అట్లు గా కాజి కీకొంద ♦ మన్ననిప్పుడు
మనవరూధిలో విక్రమ ♦ మమున సింహ
రాజ మని చెప్ప నొప్పు సో ♦ హ్రాబును దాఁకు
వీరుఁ డెవ్వండు ? వేగంబ ♦ వెదుకవలయు.
నిన్న రేయి రుస్తుము వచ్చి ♦ యున్నవాఁడు
కొంటిగతి నెవ్వరిని గూడి ♦ యుంట లేదు.
లోనికనలించు కంతయుఁ ♦ బోనికతన

త్రవేత్త్రంబు దూరంబు ♦ నం దమర్చి
యూర కొక్కండుఁ దలపోయు ♦ చుండ నేనియొ,
ంతనికడ కేగి నేను వృ ♦ త్తాంత మెల్లఁ
జెవులఁ బడవైచి ప్రోత్సహిం ♦ చెదను నేఁడు
సోహ్రాబు ' పరాక్రమాదుల ♦ చొప్పుఁ జెప్పి,
పాత్రయులకును దిగమ్రింగి ♦ పౌరుషమున
చ్చు రుస్తుము వానిని ♦ బ్రతిఘటింప. ''
అనుచు వాక్రువ్వఁగఁ ' బెహూదు ' హర్ష మొంది
యట్లు గావింపుమా రుస్తు ♦ మనుమతించు
నేని ' సోహ్రాబు ' నెదిరించు ♦ మాన ఘనుఁడు
పారసీకులయందుఁ దోఁ ♦ పఁడను నింద
తొలఁగు నని చెప్పి పంపె ' గు ♦ దుర్జ ' నంతఁ
'బెరనువీజయు' నిజసీమ ♦ కరుగ వెడలె.
అయ్యెడఁ గుదుర్జ సైన్యమ ♦ ధ్యముననుండి
సైనికులఁ ద్రోసికొనుచు వే ♦ శ్మములవరుస
దాఁటి చనిచని కొండొక్క ♦ సమతలమున
నున్న రుస్తుముపటకుటీ ♦ రోత్తమంబు
దరిసి లేమొండజగిని విం ♦ తగను గన్నుఁ
గవకుఁ బర్వంబుగాఁ గని ♦ యవసరంబుఁ
దెలిపి మెల్లనయరిగి యం ♦ తికముఁ జేరె.

నప్పుడే రుస్తు మోగిర ♦ మారగించి
వచ్చికూర్చుండి కాలయా ♦ పనముకొఱకు
శునకపోతముఁ దవకరం ♦ బునను వ్రాలఁ
జేసి యాడుచు నుండె నా ♦ చెంత నున్న
బల్లమీఁదను ఫలములు ♦ భక్ష్యములును
మిగిలి పడియుండె నాతఁడు ♦ మెసఁగి నంత.
వచ్చి తనక్రేవ నిలిచిన ♦ వానిఁజూచి
హర్షసంభ్రమహృదయుండె ♦ యవలఁ ద్రోసి
శ్వానపుంగవున నత్యంత ♦ సఖ్య మొప్ప
వినతిఁగావించి రుస్తుమి ♦ ట్లనెఁగుదుర్జ !
నీకుఁ గుశలంబె ? నీరాక ♦ నాకు మిగుల
నమ్మదప్రద మయ్యె, నీ ♦ సరణి నూర
కరుగుదెంతువె యేవిశే ♦ షాంశములనొ
తెల్పుకోఁటక వచ్చుట ♦ తెల్ల మయ్యె,
భోజనము సేయు మాపైని ♦ ముద మెసంగ
యుష్మదాగమమునకుఁ బ్రీ ♦ యో జనంబుఁ
దెలుపఁ దగు " నన్న నాతఁ డి ♦ ట్టులు వచించె
"అన్నపానంబులనుగూడ ♦ నానగొనక
నలుపఁగాఁ దగ్గకార్యంబు ♦ కలిగె నేఁడు
కడురయంబున నీకుఁజెం ♦ గటకుదానిఁ

జెప్పఁ బరువెత్తుకొనుచు వ ◆ చ్చితిని జూవె?
అభిముఖంబుగ నుభయసై ◆ న్యములు నిలిచి
యుని యొనర్పంగఁ దలపడు ◆ నవసరమున
వైరిసేనాధిపతి యిరు ◆ వాగువారి
స్నాఁపి, రణశూరు నొకని సో ◆ హ్రాబుసమాఖ్యు
నుడివి యాతనితో సమా ◆ నుఁడుగ నెవ్వఁ
డగినవీరుని ననికి సి ◆ ద్ధం బొనర్పఁ
డనుచు వచియించె నామాట ◆ కాత్మ నులికి
పారసీకచమూపతి ◆ పంపె నన్ను
సర్వమును నీకుఁజెప్పి ని ◆ శ్చయ మొనర్ప.
'సోహ్రా' బెవ్వండొ మున్నెందుఁ ◆ జూడలేదు
వాని జన్మప్రవృత్తంబు ◆ నైన నెఱుఁగఁ
గాని, బలశౌర్యవిక్రమ ◆ స్థాన మనఁగ
నాలకించితి నీ కుద్ది ◆ యగు నతండు.
వేయునేటికి? నాతఁడు ◆ విక్రమమునఁ
గేసరీంద్రము, ధైర్యల ◆ క్ష్మిసమృద్ధి
మేరుధరణీధరము, జగ ◆ ద్వీరవరుఁడు
వాని నాహవసీమ గె ◆ ల్వంగ నోపు
శూరరత్న మెవండు రు ◆ స్తుమునకంటె?
వయసునందుండె నావైరి ◆ పారసీక

వరులో యేళులు విరాజిన ♦ వార లౌట
దుర్బలత్వంబు మఱికొంత ♦ తోడువచ్చె;
నోయిరుస్తుమ ! యిట్టి య ♦ పాయసమయ
మందు నీయట్టి లోకవి ♦ ఖ్యాతవీర
శేఖరుఁ డుపేక్ష చేయంగఁ ♦ జెల్లు నయ్య ?
కోపమును మాని మా కను ♦ కూలపడుము
నీదుసాయంబె యూఁతగా ♦ నిలిచి యుంటి
మన్ని విధముల, రమ్ము మా ♦ యాత్మ లలర
విజయలక్ష్మిఁ గై వసముగా ♦ వింపు మిందు
నీవు తాటస్థ్యము వహించి ♦ నిలిచి యున్న
శత్రునకు గెల్పు మన కప ♦ జయముఁ గలుగుఁ
గానఁ జనుదెమ్ము నీవారిఁ ♦ గాచుకొఱకు."
అని 'గుదుర్జ' వచింప ని ♦ ట్లనియె రుస్తు
ముల్లసంబుగ మొలకన ♦ వ్వొలయుచుండఁ
"బారసీకమహావీర ♦ వసులు ముసళు
లైన నేఁ గాక యుందునె ? ♦ యధిపుఁ డాత్మ
నాగ్రహించును దుర్బలు ♦ లనుచు వారి
నీవు వాకొంటవిన్న చో ♦ నిక్కువముగ :
వయసునం దాతఁ డుండిన ♦ వాఁడుగాన
నీడుజోడైనవారల ♦ నెల్ల మెచ్చు

ముదిమి బ్బల మఱి మిత్త్రికి ♦ నెదురుసూచు
వారి మముఁబోర్ట్లఁ బిల్చు టే ♦ గౌరవంబు ?
క్షేత్రపాత్రియంబువారు వి ♦ ఖ్యాతవీరు
లెంద ఱెందఱో యుండంగ ♦ నేనెవచ్చి
«సోహ్రాబు» బును గెల్వవలయునే ? చోద్య మయ్యె !
అతనిభువనైకశూరుఁ డం ♦ చఖిలజగముఁ
బొగడుకొనియున్ను నే నీసుఁ ♦ బొంద నేల ?
కూఁతునకుమాఱు నా కొక్క ♦ కొడుకు సోహ్రా
బట్టివాఁడున్న వానిజ ♦ న్యమున కనిపి
ముసలివగ్గగు నాతండ్రి ♦ పొంత నతనిఁ
గాచికొని యుండనే ? యన్య ♦ కాంక్ష లుడిగి.
ఆప్తులు భీతి యించుకం ♦ తైన లేక
వృద్ధు నాతండ్రి మిక్కిలి ♦ వెతలఁబెట్టఁ
దలఁచు చుండుదు రింక నా ♦ తనిని జేరి
సౌఖ్యముగ కాలమును బుచ్చఁ ♦ జనదె నాకు ?
«సోహ్రాబు» బంతటిసుతుని గాం ♦ చుటకుఁ బట్టె
పుట్టనైతిని, నాజన్మ ♦ మునకు నింకఁ
జాలు నీ నీచవృత్తి, వి ♦ శ్వాసహీన
వసుమతీశ్వరసైన్యంబు ♦ పసఁదొలంగఁ
జూచుచు న్నిను చుంకుదు ♦ సోహ్రాబు బొందు

విక్రమోపార్జితంబగు ♦ విశదకీర్తిఁ
దండ్రిసన్నిధినే సంత ♦ తంబు నుండి ;
మబ్బలె వయసును, మెప్పును ♦ మాయ మయ్యెఁ
జాల దవ్వయ్యె నాకును ♦ సమరమునకు ”
అనుచు రుస్తుము వలుకంగ ♦ నా ‘గుదుర్జ’
“ ఓయిరుస్తుమ ! యి ట్లను ♦ టొప్ప రిపుడు
పూర్వవైరము మదినుంపఁ ♦ బోకు మయ్య !
యందఱకు నున్న దాన నీ ♦ యందు, నేఁటి
యుద్ధమునఁ దన్నుఁ దాఁకంగ ♦ నుద్ది యైన
వీరుఁ డొకరుస్తుమే యంచుఁ ♦ గోరె నొంటి
పోరు ‘సోహ్రాబు’ నీతోడఁ ♦ బోరుకొఱకు.
ఇట్టి చో నీవు సంగ్రామ ♦ వృత్తి విడిచి
తండ్రిచెంతను గూర్చుండఁ ♦ దగునె చెప్పుమ ?
తా వరించిన కీర్తికాం ♦ తామతల్లి
బాలశూరులు హరియించు ♦ వా రటంచు
రుస్తు మిప్పుడు సంగర ♦ రోష ముడిగి
యుండె ననునిందఁ బొందుచు ♦ నుండఁ గలవె ?”
అనిన నాతఁడు రోషక ♦ షాయితాక్షుఁ
డగుచు నప్రస్తుతప్రసం ♦ గాభిలాష
చాలు నిఁకఁగట్టిపెట్టుము, మీ ♦ జగము నందుఁ

కీర్తినొకఁడొందు నొకఁడప ♦ కీర్తిఁ గాంచు
ధీరుఁ డొక్కరుఁ డగు నగు ♦ భీరుఁ డొకఁడు
బాల్యమున నుండు నొక్కఁడు ♦ వార్ధకమును
గాంచు నింకొక్కరుఁడు నాకుఁ ♦ గన లదేల!
ఎవ్వ రేరీతి నున్న నా ♦ కేమిగాదువ!
వారుమనుజులు నేఁగానొ ♦ వీరకేళి
నే నరుండు కృతఘ్నుభూ ♦ మీఁదప్రవినుతి
నభిలషించెదు? నీ వన్న ♦ యట్లు బాల
వీరు లేగతి సంగరో ♦ ర్వినిమదీయ
శౌర్యనముపార్జితప్రశ ♦ స్తప్రశస్తి
నపహరింతురొ చూత మా ♦ వరుగు మేను
వచ్చితి నటంచుఁ బ్రకటింప ♦ వలదు నేఁడు
సంగర మొనర్తు మాఱువే ♦ షము ధరించి."
అని 'సుదుర్జ' రయంబున ♦ హర్షచిత్తుఁ
డగుచు నత్తఱి జగజెట్టి ♦ యైన రుస్తు
మన్ననుదులకు భయవిస్మ ♦ యంబు లొదవ
వేగిరముగ గుడారంబు ♦ వీడి చనియెఁ
బిదప రుస్తుము భటులను ♦ బిలిచి సత్వ
రముగ నాత్మీయకవచాయు ♦ ధములు తేర
నాజ్ఞగావించి కవచంబు ♦ నవధరించి

నూతనపుబల్లెమును డాలుఁ ♦ జేతఁబట్టి
తలకుఁ గాంచనమయ శిర ♦ స్త్రంబుఁ దొడిగి
తెల్లనితురాయి దానిపై ♦ నల్లలాడ
వీరరస మిట్లు మూర్తిభ ♦ వించె ననఁగఁ
దనగుడారంబు వెలువడి ♦ చనఁదొడంగెఁ
గూడ నడచెరఁ బెంపుడు ♦ గుఱ్ఱ మొకటి.
పారసీకులు కన్నుల ♦ పండువుగను
వాని రాకను గాంచి య ♦ పారముదము
నొందు చుండిరి, తార్తారు ♦ లొకరి మొగము
నొకరుగనుఁగొంచుఁ దెలియక ♦ యుండి రీతఁ
డెవ్వఁడై యుండునో యని ♦ యొలమిదక్క.
రాత్రిదనుక సముదగ్రత ♦ రంగరాజి
మౌక్తికంబుల నేరునా ♦ నశ్రు నాత్మ
విభుఁడు మున్గంచుఁ దేలుచుఁ ♦ బెక్కుగతుల
మెలఁగు చుండ నాతనిపాగ్ర ♦ ములకు నెట్టి
చేటుమూడునో యనుభీతి ♦ చేత నడలి
కన్నుఁగొలుకుల నురుబాష్ప ♦ కణము లురల
నేడ్చుచుండిన యిల్లాలి ♦ హృదయమునకు
పలని యిచ్చిన ముత్తియం ♦ బులనుజేర్చి
హారముగ గ్రుచ్చి తెచ్చిన ♦ యట్టివిభుని

రాక వ్యోగతి హర్షసం ♦ భ్రమసుఖంబు
నొసఁగు నాకతి “సోహ్రాబు” నోర్పు పెల్లా !
యనుచు దిగులొందుమనముల ♦ నడరు పార
సీకులకు రుస్తు మరుగుడెం ♦ చినదిమొదలు
ప్రబలసంతోషధైర్యవి ♦ క్రమములొదవె.
అపుడు రుస్తుము శత్రుసై ♦ న్యమునుదఱియ-
నేగుటయు సోహ్రాబదిచూచి ♦ యెలమితోడ
నాయుధంబులు ధరియించి ♦ యల్ల వీరుఁ
డున్నచోటికి నేతెంచు ♦ చుండె వడిగ.
అట్లు దోతెంచు వీరాగ్రి ♦ యాయి నతఁడు
చూచి యాశ్చర్య మొందంగఁ ♦ జొచ్చె నంత,
జనకు దర్శింప జీవితా ♦ శయును విడిచి
సాహసపుఁగర్జము లొనర్చి ♦ సద్యశంబు
నందుకోరిక నుత్సాహి ♦ యగుచు శౌర్య
రాశియో యన వచ్చు ‘సో ♦ హ్రాబు” ను దెప్ప
వేయకయ రుస్తు మూతసి ♦ వివిధగతులఁ
దలఁచు చుండెను మదిలోనఁ ♦ గలఁతపడుచు
రాజపుత్రికచేత గా ♦ రవముమీఱఁ
బ్రోదిసేయంగఁబడి స్వాయం ♦ బుగను రేయిఁ
బండువెన్నెలవచ్చిక ♦ పట్టునందు

మిగుల లేసీడ లాడంగ ♦ సొగసుగులుకు
నట్టి యారామమున నల ♦ రారుచుండు
బాలసహకారభూజంబు ♦ లీలఁ దనరు
"సోహ్రిబు" ను గన్న లారంగఁ జూచి రుస్తు
మాత్మ నాతని సౌకుమా ♦ ర్యమును, లేఁత
వయసుఁ దలపోసి కడుజాలి ♦ పడుచు నిలిచి,
హ స్తసంజ్ఞను వాని ర ♦ మ్మనుచుఁ బిలిచి
"యువ శిరోరత్నమా! ప్రాణ ♦ ముండెనేని
బడయఁగావచ్చు సుఖము, జీ ♦ వములు విడిచి
కాంచునది యేమి? శూన్యంబు ♦ గాన, నన్నుఁ
గనులఁ జూడుము బాహువి ♦ క్రమము కలుగు
కవచధారిని నేఁ బెక్కు ♦ బవరములను
నిలిచి విజయంబుఁగొంటి నా ♦ పలుకు వినుము
నేను గావించు రణముల ♦ లోన నెపుడు
నపజయంబును గొనుటయు ♦ నరులు నాకుఁ
జిక్కి చాకుంటయును లేదు ♦ నిక్క మిదియ.
ఓయి సోహ్రిబ! నినుఁజూచు ♦ చున్న నాకు
జాలి కల్గుచునున్న, దీ ♦ నరణి మిత్తి
వాఁతఁ బడనుంటివనుచు నా ♦ వచనములను
వినుము నీమేలుఁగోరి చె ♦ ప్పినవిగాఁగ,

పుత్ర నన్నుఁగూడి విడుము తా ♦ ర్తారుదళము,
హాయిగా వసియింపు మ ♦ దీయ గృహము
దు, నీవాత్మజుఁడు గాఁగ ♦ నలరుచుందు,
మరణ మేనొందుదనుక ని ♦ ర్వైరముఁ గూడ
నరసీమల విజయోత్స ♦ వములఁ గనుచు
నుల్లసిల్లవచ్చు, లేఁడు నీ ♦ కుద్దియైన
హారకుల భూషణము నేఁటి ♦ వీరులందు"
అనుచు సాదరహృదయుఁడై ♦ యాడుచున్న
నతని కంఠస్వరము విని ♦ యద్వితీయ
బల పరాక్రమ గాంభీర్య ♦ విలసనములఁ
గాంచి యున్నత దివ్యవి ♦ గ్రహముఁ జూచి
నరయ దొరకొన్న పెన్నిధు ♦ లరసి 'సోహ్రా'
బాత్మలోపల నొకకొంత ♦ యాసపడుచు
మోహమున వాని ముంగల ♦ మ్రొగ్గతిల్లి
హస్తయుగళంబు ముకుళించి ♦ యనియెనిట్లు
"నిన్నుఁజూడఁగ నామది ♦ కెన్నరాని
వింతసంబర మొదవ్వ ♦ వించెనిపుడు
నీవు 'రుస్తుము' వౌదువో! ♦ కావొ? చెపుము"
అనఁగ రుస్తుము విని చాల ♦ నబ్రపడుచు
వాని నొక కంటఁగాంచి భా ♦ వమున నెంచె

« ఏమి యీవింత ! తార్క్వారు ♦ లెంత కేని
తగుదు రిన్నృతాత్ములును గర్వ ♦ ధనులునగుచు
రేని ' రుస్తుము ' నని చెప్పి ♦ వీనికోర్కెఁ
దగును దీర్పంగనన ఫలి ♦ తంబుకలదె ?
ఎన్ని విధములఁజూచిన ♦ నితఁడునాకు
లొంగునను నాశగాని నా ♦ లోనఁ గూడు
నన్న యాశయుఁగాని ర ♦ వంత లేదు.
కాని యితఁడిప్పుడేమిష ♦ యైనఁ బెట్టి
యుద్ధమునుమాననూహించు ♦ చుండియేమొ
నన్ను నీరీతిఁ బొగడుచు ♦ నున్న వాఁడు,
ఎద్దియేని యుపాయనం ♦ బిచ్చినాకుఁ
బ్రాణరక్షణమున కాస ♦ పడియె నోటు !
నన్ను వీడ్కొని చనిన య ♦ నంతరమున
నతఁడు ప్రభుఁడున్న సభలోని ♦ కరిగియొక్క
పండుగు దినంబునందెల్ల ♦ వారువినఁగ
« సభ్యవరులార యొన్నటి ♦ జన్యమందు
నాకస్నునదీతటంబున ♦ నస్మదీయ
విక్రమంబును వెలయింప ♦ వీరుఁడయిన
వాని రమ్మంటి నాతోడ ♦ ద్వంద్వసమర
కేళిఁగావింప, నట్లు వ ♦ ల్కినఁదెగించి

పారసికులలో నొక్క ♦ వీరుం డయిన
ముందరికిరాక మీఁదును ♦ గ్రిందుఁజూడఁ
బారుసైక జీవనుఁడైన ♦ శూరరత్న
మల్ల 'రుస్తుము' బిఱబిఱ ♦ నరుగుదెంచెఁ
గలఁకునను నన్ను మార్కొని ♦ గెలుపుఁగొనఁగ.
అట్టియెడ మేము పోరాట ♦ మాఁగి మిత్రి
భావము వహించి మాత్సర్య ♦ పటిమ వీడి
మఱలితి మటంచు సభ్యుల ♦ చ్చెరువుజెంది
చప్పటలుగొట్టె నీతఁడు ♦ చెప్ప నేమొ?
అయిన నేమాయె నే నిట్టు ♦ లనెదఁగాక!
'సోహ్రాబా! చాలుఁజాలు సం ♦ స్తుతుల కేమి
అల్ల 'రుస్తుము' కాక నీ ♦ కన్యవీర
భటులు సంగ్రామ మొనరింపఁ ♦ బనికి రారొ!
సకలపరిపంథిదంతికే ♦ సరి యనంగ
నొప్పు నాతనిఁ గని వీరు ♦ లుల్లములను
దల్లడిల్లుదు రావీర ♦ తల్లజుండు
నిజముగా వచ్చి 'రుస్తుము' ♦ నేనె యనుచుఁ
బలికి యాహవ మొనరింప ♦ నిలిచె నేని
నీవు రణకేళి మానుట ♦ నిజము సుమ్మీ
అట్టులది యుండనిమ్ము ని ♦ న్నరయు టాది

జాలి పొడమును నుండె నా ♦ స్వాంతమందుఁ
గానఁ జేతులు రావు నీ ♦ కంఠమంటఁ
మనుమఁగా నాకు, నీకుఁ గేలు ♦ దోయి మోడ్చి
యోడితిని గావు మంచు న ♦ న్వేఁడికొనుచు
యసువు లాసింతు వేని, గా ♦ దంచువేని
చావు నిక్కువ మేల ని ♦ ష్కారణముగ
విసువ నెంచెద నీవుజీ ♦ వితము నకట!''
అనిన 'సోహ్రాబు' 'రుస్తుము' ♦ నాననంబు
తేఁతనగవునఁ దిలకించి ♦ "లేమ ననుచు
నెంచితో యేమొ నన్ను, నీ ♦ వెంత పిఱికి
మందుఁబోసిన నాయుక్కు ♦ డెందమునకుఁ
జలన మనుమాట సుంతయుఁ ♦ గలుగఁబోదు
'రుస్తుమే' యిచ్చటికి నేఁడు ♦ వాస్తవముగ
వచ్చియుండిన నే నాహ ♦ వంపుదిక్కు
మానుకొనియుందు నాలోక ♦ మాన్యవీరుఁ
డిందు లేకుండుటను మన ♦ యిరువురకును
నాజి కాకుండు టెట్లు వీ ♦ రాగ్రగణ్య!
బలపరాక్రమధైర్య సం ♦ పదలయందు
ఘనుఁడ వైనఁ గావచ్చు నా ♦ కంటెఁ బెక్కు
యుద్ధములు చేసియుందు వీ ♦ యుర్విలోన

శూరచూడామణి యటంచుఁ ♦ బేరుఁగాంచి
నీ వనినయట్లు బాలుండ ♦ నే నిజంబు.
కాని జయము దైవాధీన ♦ మైన దగుట
నెదిరికో నీకొ జయ మించు ♦ కెఱుఁగరాదు.
సాగరంబున నీఁదెడు ♦ జనులమీఁది
మనము విధివీచికాగ్రిమం ♦ దునను దేలి
యాడుచుండుట నయ్యది ♦ యవలగట్టుఁ
జేర్చునో ముంచునో తెలి ♦ సికొన నేర
మది ప్రయత్నించినను దెలి ♦ యంగఁ బడదు
కార్యఫల మొక్కటియె తెల్పఁ ♦ గలదు దాని."
అనుడు నాపేరుఁ డత్యాగ్ర ♦ హమును బొంది
యీఁటెఁ జేఁగొని 'సోహ్రాబు' ♦ నేయ నదియు
నతిజవంబున గువ్వ వెం ♦ టాడు నణుఁజు
పగిదిఁ జనుదేర నతిలాఘ ♦ వంబు మెఱయ
నవలి కొక ఘుంజవేయ నా ♦ యస్త్రశంబు
ధ్వని యొనర్చుచు సైకత ♦ స్థలిని దూఱె,
నపుడు 'సోహ్రాబు' రోషించి ♦ యమితశక్తి
వానిమీఁదికి బల్లెంబు ♦ వైచినంత
శీతగిర్యటవులలోన ♦ సీతునందు
వినుము పెనుగాడ్పులకు వేళ్లు ♦ పెల్లగిల్లి

విఱిగి నేలను బడి కొండ ♦ దరులనుండి
యమితజలవృద్ధిఁ బ్రవహించు ♦ నట్టి నదులఁ
దేలియాడుచు మెలమెల్లఁ ♦ దిరుగుచుండ
నావలను జేసికొనఁగోరి ♦ ధీవరాళి
గట్టుఁ జేరిచియుంచిన ♦ చెట్టొకండుఁ
జేవగల్గిన దానిని ♦ జేత నొడిసి
పట్టి పై కెత్తి యనివార్య ♦ బలముతోడ
'సోహ్రాబు' ను మొత్తె 'రుస్తుము' ♦ ఘోరపరుఁడు.
కాని, యేతత్ప్రహారమ్ముఁ ♦ గాచికొనియెఁ
బ్రక్క కొదుగుచు నాతండు ♦ పాయశాలి.
అట్లు తప్పించుకొనిన ప్ర ♦ హార మవనిఁ
దగిలి భూకంప మైనవి ♦ ధంబుతోఁప
గుదియ 'రుస్తుము' హస్తంబు ♦ లదరుఁజెందఁ
గ్రింద దొరలుచు జాఱె, నా ♦ వ్రేటుకతనఁ
దూలి పడిపోయె నాతండు ♦ కేలుదోయి
యిసుకలోఁ గ్రుచ్చుకొనె, నట్టి ♦ యెడను సాహ
సమునఁ గోశంబునుండి ఖ ♦ డ్గమును బెఱికి
'రుస్తుము' ను జంపి యపుడె శ ♦ త్రుక్షయంబు
చేయఁ జాలియుఁ గారుణ్య ♦ చిత్తుఁ డగుట
'సోహ్రా' బేమియుఁ దోఁచక ♦ చూచుచుండె

మోహమదమ్మిని చిఱునవ్వు ♦ మొలకలెత్త
మృదులవచనంబులను వాని ♦ కిట్టు లనియె
" ఎంతగట్టిగఁ గొట్టితి ♦ విపుడు గుదియ
జాఱి తుళ్లిపడంగఁ దా ♦ ర్తాకు లడలఁ
దనువునొచ్చెనా! నాకునీ ♦ కును విరోధ
భావ మేటికి? మిత్రభా ♦ వంబుఁ గనుము
చిత్ర మదియేమొ నిన్నుపీ ♦ డించినపుడు
క్రోధ మడుగంటు నెయ్యంబు ♦ కొంతకలుగు
" నీవు దుస్తుమవా ?" యంచు ♦ నిన్ను నడుగఁ
గా నటంచు వచించితి ♦ గాన నాకు
నధికసంతోషసంధాయి ♦ వైన శూర
తిలకమవు నీ వెవండవో ♦ తెలుపఁ గదవె!
బాలకుఁడ నయ్యుఁ జూచితి ♦ భండనముల
నల్లకాలువలను దాఁటి ♦ నాఁడ వడిగఁ
బ్రాణములు వాయువారిని యా ♦ క్రింద గవము
వింటి బెక్కండ్రఁ జంపితి ♦ విక్రమించి
కాని మున్నెన్నఁ డీరీతి ♦ గా మనంబు
వైరిపట్టున నభిమాన ♦ పడి మొఱుంగ
దేమికారణమో దీని ♦ కెఱుఁగ రాదు;
మనకు జగడంబు లేటికి? ♦ మైత్రి కలిమి

గు చందము చిరకాల ♦ మిత్రు లట్లు.
ఆయుధంబుల నెల్లను ♦ నవల బెట్టి
గూర్చుండి యా 'రుస్తు' ♦ మెట్లు నంగ
రంబు లొనరించె విక్రమ ♦ క్రమ మెలర్ప
ములంబులను గల్గి ♦ నట్టి డగునొ
నుపుమా వినవేడుక ♦ పడుచు నుంటి.
లో వీర ♦ వరులు కలరు
పెక్కు రాహవమున నన్ను ♦ వీక దాక
నెదిరింపగల శౌర్య ♦ నిధు లనేకు
లలుగు చున్నారు తార్తారు ♦ లందు గూడ.
రేని నీతోడ ♦ బోరితంబు
చేయ జనుదెంతు రే నని ♦ సేయు మీవు
నిర్ధారకును వైర ♦ మనువుపడదు
నను నామాట వైరస్య ♦ ముడిగి నేడు."
యుండుటయు 'రుస్తు' ♦ మాగ్రహమ్ము
కొనంగ శరీరంబు ♦ వణకు చుండ
నక యాడు ♦ గఱచి లేచి
మెఱుపుచందాన దళతళ ♦ మెఱయుచున్న
గేల ధరియించి ♦ త్వరితగతిని
బిగించిన కవచంబు ♦ తోడ గుండె.

లదటుఁ జెందఁగ గొంతుక ♦ యూఁటిపోవ
మాట తడఁబడఁ గోపసం ♦ భ్రాంతికతన
నిట్టు లనెఁ దుట్టతుదకు వా ♦ యెత్తి యత్తఁడు
"ఆఁడుచందపు నీమాట ♦ పోఁడిమియును
జేతులనుద్రిప్పనేర్పును ♦ జెల్లె నింక
నీ యసహ్యోక్తులను విన ♦ నేర నోరుఁ
దెఱువకుము చాలుఁ, జాలిన ♦ ధీరువోలెఁ
గదనమునకుఁ గడంగు, మి ♦ క్కడను నీకు
న్నాటలాడంగఁ దార్తారు ♦ బోఁటు లెవరు
లేరు, శృంగారవనములు ♦ తేవు తిరుగ,
నాక్సునదీతటంబున ♦ యందు నుంటి
వివృుడు నినుఁబోలె నాయోధ ♦ నేచ్చ విడిచి
పొలఁతిపలుకులు పలికెడి ♦ కొలఁదిగాను
బ్రిబలిసంగ్రామకేళ్యభి ♦ రతుఁడఁగాని.
నీయెడను నాకుఁగల్గిన ♦ నెయ్య మెల్ల
నరిగె నానాఁడె, నీవిక్రి ♦ మాతిశయము
నీ కుయుక్తులు నీమాట ♦ నీటు నాకుఁ
దెలియఁగావచ్చె రెండుసే ♦ నలును వినఁగ
నన్నుఁ జుల్కనచేయ నీ ♦ వన్న పలుకు
లెల్ల ములుకులగతి నాటె ♦ హృదయమందు"

అనుచుఁ బల్కిన 'సోహ్రాబు' ♦ త్యాగ్రహంబుఁ
జెంది తనశాతఖడ్గంబు ♦ నంది యట్టె
'రుస్తుము' ను దాఁకె నాతండు ♦ రోషపూర్ణి
తాంతరంగుండుఁ గ్రోధతా ♦ మ్రాక్షుఁ డగుచుఁ
దాఁకె 'సోహ్రాబు' నిట్టు లి ♦ ద్దఱును నొక్క
యెరకె పరువెత్తు పక్షిలో ♦ కేంద్రులట్లు
సమరమునకుఁ గడంగఁ గ్రే ♦ డెములు రెండు
గవిసి యొండొంటితో వింత ♦ గా ధ్వనించె,
నాటవికులు కాననభూరు ♦ హములుగొట్టు
తటిని జనియించు పరశుఘా ♦ తములఁబోలెఁ
బొదలెను బరస్పరాఘాత ♦ ములు రణోర్వి.
రవియుఁ జుక్కలుఁగూడ నా ♦ రణము తెఱఁగు
నరసి యావీరవరుల శౌ ♦ ర్యాతిశయము
సైఁపఁజాలక మేఘంబు ♦ చాటుఁ జేరి.
రనఁగఁ దత్కాంతి మాయమ ♦ య్యెను జగానఁ
బ్రబలి సుడిగొట్టుతో దుమా ♦ రంబు రేఁగి
వారినిర్వురఁ జుట్టువె ♦ వంగఁ దొడఁగె,
నహాహ! దైవవిలాస మ ♦ త్యద్భుతంబు!
యుద్ధమునుజూచు నిరుమొక ♦ లున్నచోట
నొడ కాయుచు నుండె భా ♦ నుండు మెఱసె

నాకసునదీజలంబున, ♦ నాకసంబు
స్వచ్ఛముగ నొప్పు నాపీర ♦ వరులు పెనఁగు
లాడు చోటాక్కటియుఁ దిమి ♦ రావృతముగ,
నైన నచ్చటనే నిల్చి ♦ యధికరోష
పరవశత్వంబుఁగొని బిట్టు ♦ పంతగించి
పోరు చుండిరి నిట్టూరు ♦ పులుజనింప.
ఆది 'రుస్తుము' తనకుంత ♦ మతనిమీఁద
విసరె, నది వానికరమందు ♦ వెలయుచున్న
డాలు డీకొని నాటంగఁ ♦ గేలదానిఁ
బెటికి కాలాంతకాగ్రిహో ♦ ద్వృత్తి 'సోహ్రా'
బాతని శిరస్త్రముసఁ దన ♦ యస్త్రళంబుఁ
బూనివ్రేయంగ నది ముక్క ♦ ముక్క లయ్యె,
నెన్నఁడు నగౌరవం బొంది ♦ యెఱుఁగనట్టి
యందలితురాయి చెడి మట్టి ♦ యయ్యె నపుడు
'రుస్తు' మాఁతల వాంచెఁ గా ♦ రొక్కనియె నంతఁ
గాఱుచీఁకటి శంపలా ♦ కాశవీథి
మెఱయ మేఘంబు పిడుగులు ♦ విఱిగి పడెడు
భంగి నుఱుమంగఁ దోఁకఁగె న ♦ భ్రంబునుండి
యపుడు సామీప్యమున నున్న ♦ యతనిపార
సీక వాహోత్తమంబు హే ♦ షించె మిగుల

భీషణంబుగ, నది హయ ♦ హేషకాదు
ఘోరవనసీమ నాఖేట ♦ కుని నిశాత
శరము డుస్సిన సింహరా ♦ జంబు మరణ
కాలమునఁ జేయు భీకర ♦ గర్జగాని !
వీర్వారంబు లాధ్వని ♦ విని యపూర్వ
భయసమాకులగతిఁ దొట్రు ♦ పాటుఁగాంచె
నాకసునదీజలం బల్ల ♦ లాడు టుడిగి
నిలుకడవహించె నపుడు ఘ ♦ నీభవించి
నట్టి తెఱఁగునఁ గాని “ సో ♦ హ్రాబు ” రవంత
యైన నులివాడకయు నిశి ♦ తాయుధమున
నతనివ్రేయుచు నొదల ♦ నట్టెవాంచెఁ
బరుఁ డొకటిమాత్రమే తన ♦ కరమునందు
మిగుల, వేముక్కలై కత్తి ♦ పగిలిపోవ
నంత ‘ రుస్తుము ’ రోషభ ♦ యంకరాక్షుఁ
డగుచు శిర మెత్తి ప్రళయకా ♦ లాంతకుండు
వోలె నిజహేతి నాడించి ♦ బొబ్బరించె
నపుడు “ రుస్తుమురుస్తు ” మం ♦ బా స్వరంబు
విని మహాద్భుతచిత్తుఁడై ♦ వెనుక కొదఁగె,
‘ సోహ్రా ’ బెదుటను గాంచి రు ♦ స్తుమునిరూపు
నిలిచెఁ, గలగుండువడి డాలు ♦ నేల విడిచె,

స్త్రీయెడ, 'రుస్తు' మతని ని ♦ జాయుధమునఁ
బొడిచె నొకపరిక్కఁ, దడఁబడ ♦ నడుగు లిడుచు
'సోహ్రాబు' పిఱింది కల్లన ♦ సోలె నంత
గాలియును సన్నగిల్లెఁ గెం ♦ ధూళి యడఁగెఁ
దెఱమఱుంగుననుండి యే ♦ తెంచులీల
భానుఁ డంబుదమును వెలు ♦ వడియె రెండు
పక్షములవారుఁ జనుదెంచి ♦ వారికడకు
నిలిచి యుండిన 'రుస్తుము' ♦ నేలఁ బడిన
'సోహ్రాబును' గాంచి రానంద ♦ శోకములను
వరుసఁ బొందుచు ; 'రుస్తుము' ♦ వక్రహాసుఁ
డగుచు నిట్లనెఁ బెద్దగా ♦ యంబు తగిలి
బాధపడుచున్న 'సోహ్రాబు' ♦ వంకఁ జూచి
"ఓయిసోహ్రాబ! శూరాగ్ర ♦ యాయిమైన
పారసీక మహాప్రభు ♦ వధ మొనర్చి
పుణ్యముం గట్టుకొన మనం ♦ బునఁ దలంతె!
నిన్నుఁ బాలించు ప్రభువుమ ♦ న్నించు నను
'రుస్తు' మంతటి వీరవ ♦ ర్యుండువచ్చి
నీ పరాక్రమమును మాట ♦ నేర్పు మెచ్చి
యొక్క పసదనమునుగొని యుల్ల ♦ మలర
నని, యొనర్చుక మగుడి తా ♦ నరుగు నేని

గలుగు జగదేకవీరవి ♦ ఖ్యాతి యనుచుఁ
దలఁచు చుంటివో యేమొ! తా ♦ ర్తారుదళము
దుర్భరజరావృతుండయి ♦ తూఁగులాడు
చుండు నీతండ్రి మెచ్చ నీ ♦ దండితనముఁ
బొగడిక యొనర్చు నని తల ♦ పోసితేమొ!
పాపము! త్వదీయయత్నంబు ♦ భగ్నమయ్యెఁ
బారసీకుల సామాన్య ♦ భటునిచేతఁ
బ్రాణములు వాయుటయునుసం ♦ ప్రాప్త మయ్యెఁ
దావకీనపరితాపతే ♦ జోవిశేష
మింకమీఁద సృగాలంబు ♦ లే నుతించు
నాలుకలఁ జవు లూరుచుం ♦ దమునఁ బ్రేమ,"
అనిన 'సోహ్రాబు' చుఱచుఱ ♦ నతనివంక
దృష్టిఁ బరఁగించి సన్నని ♦ యెలుఁగుతోడ
ననియె "నిష్పౌరుషుండ వీ ♦ వగుదు నిజము
నీవవిశ్రాంతి నన్నుఁజెం ♦ డినభటుండ
వను టబద్ధంబ యగును శూ ♦ రాగ్రగణ్యుఁ
డల్ల 'రుస్తుమొ' నన్నుఁ జ ♦ క్కాడి యరిగె.
అట్లు కాకున్న నీవంటి ♦ యల్పవీరు
లస్మదీయపరితాపతే ♦ జోనలాంత
రమున శలభాయమానులై ♦ యమపురంబుఁ

ర కుండురె? నీవలెఁ ♦ జెంత నేను
నిలిచి యుండనె? నేలపై ♦ నీవు పొగులఁ;
రుస్తుఁ మనుమాట వినినంత ♦ రోష ముడిగి
కాలుసేతులుఁ వడఁకంగఁ ♦ గార్యవిధము
మఱచి చలియించుచిత్తంబు ♦ మరలుకొనమి
నీమొగముఁ జూచినకొలంది ♦ నెయ్యమొదవె
నంతఁ దనయంత నాయుధం ♦ బవనిఁ బడియె,
నట్టి నన్ను నిరాయుధుఁ ♦ బట్టి పాప
మనక జగజెట్టివై నుఱు ♦ మాడి తౌర!
ఇంత ఘనకార్యమును ఘటి ♦ యించినాఁడ
నంచు గర్వింపకుము యింత ♦ కంతకలదు,
మోస మొనరించి చంపె నా ♦ పుత్రు నంచు
నెఱిఁగి నాతండ్రి 'రుస్తుమొ' ♦ యేగుదెంచి
నేఁటరేపట నిను దీర్ఘ ♦ నిద్రపుచ్చు.
అమ్మహావీరుఁ దాఁకుట ♦ కర్హు లెవరు?
తరణిసుతపురవాస త ♦ త్పరులు తక్క
ఏమహాశూరు దర్శింప ♦ నెంచి యెల్ల
జగము గాలించుచుంటి నా ♦ సమరశౌండుఁ
డల్ల 'రుస్తుము' నాతండ్రి ♦ యరుగుదెంచి
పగను సాధించు నినుమిత్తి ♦ వాతఁ గట్టుఁ?

అతిప్రయత్నంబుమై నర ♦ ణ్యమున నొక్క
కొండచఱిమీఁద రాబందు ♦ గూడుఁగట్టి
యందుఁ దనబిడ్డతో నున్న ♦ యప్పుడు వేఁట
కాఁడు గుఱిచూచి యాపుల్గు ♦ గఱిత నేయ
నేటువడి గూడు వెలువడి ♦ యెగసియెగసి
యొక్కచోఁ గూల నద్దాని ♦ యునికి నెఱుఁగ
కాత్మశిశువున్న యల కులా ♦ యంబుఁజేరి
పిల్ల నొంటిని గని పక్షి ♦ విభుఁడు తలరి
విడిచి చనె నంచు సతిని గో ♦ పించుకొనుచు
గూడుచుట్టును దిరుగుచుఁ ♦ గూయుచుండి
తనపడంతుకమృతిఁ దెలి ♦ యని విధాన
నెదుటఁ దనపుత్రకుఁడు చావు ♦ బ్రదుకులందుఁ
గొట్టుకొనుచుండఁ జూచుచుఁ ♦ గ్రోధర క్త
నయనుఁడై యుండె నిజకృపా ♦ ణము ధరించి ;
మఱియు నాతండు నమ్మక ♦ మాఁలివలికెఁ
"దండ్రి యగునంట! 'రుస్తుము' ♦ తండు వచ్చి
పగను సాధించుకొనునంట! ♦ బళిరె! కొడుకుఁ
గలుగువాఁడంట! 'రుస్తు'మొ ♦ క్కడినిజంబు!
అనిన హీనస్వరమున 'సో ♦ హ్రాబు' వచించె
'రుస్తు' మీ వెంచిన ట్లపు ♦ త్రుండుకాఁడు

కలఁడు సూనుం డొకండు, నీ ♦ ఖడ్గధారఁ
బడిన యీ 'సోహ్రబే' వాని ♦ పట్టినమ్ము,
నమ్ము నామాట యిది యస ♦ త్యమ్ముగాదు.
మిగులదుఃఖంబుఁ గూర్చునా ♦ మృతినెవండొ
యాతఁడొంటిగఁ గూర్చుండు ♦ నపుడు దెలుప
గుండియలువ్రీల మదికల ♦ గుందువడఁగ
నన్నుఁదలపోసి విలపించి ♦ నామృతికిఁ
గారణం బైన నినుఁబట్టి ♦ కఱకుఁగత్తి
మొనకు బలియిచ్చు కొఱకయి ♦ మనసుకంటె
వేగిరంబున గచ్చి నీకు ♦ బెద్దనిదుర
పుచ్చిజోకొట్టిచను, నేక ♦ పుత్రునన్నుఁ
జంపితివి దుష్టమిఁక శోక ♦ సాగరంబు
నెట్లుదరియించు ? నాతని ♦ హృదయచింత
తీరుటెట్టులు ? పగను సా ♦ ధింపకుండఁ,
బ్రాణమేయున్నఁ గాంతుఁ గా ♦ కతని నెగులు.
తండ్రిఁగూఱిచి యంత నం ♦ తాపపడను
'గుర్దు' జనపాలునకు ముద్దు ♦ కూఁతు రగుచు
భర్తలోకైకవీరుఁడై ♦ భండనములఁ
విరుగు నండంగఁ దండ్రిద ♦ గ్గఱనె యుండి
యసురు లన్నియు నామీఁద ♦ నుంచికొనుచు

నాహావంబులఁ గొల్లగొ ♦ న్నట్టి ధనము
తోడఁ గుశలంబుగా వచ్చు ♦ వాఁడు సోహ్రా
బింటి కంచును దనమది ♦ నెంచుచుండు
నట్టి పుణ్యాంగనామణి ♦ యైన తల్లిఁ
దలఁచిన కొలంది దుఃఖంబు ♦ కలుగుచుండె.
క్రమముగాఁ గొన్నినా ళ్లేగ ♦ సమరమందుఁ
గూలె సోహ్రాబటంచను ♦ కొందఱు జనులు
దాని నాలించి నాతల్లి ♦ మానసమున
నూరుఁబేరును లేనట్టి ♦ యొక్క నీచు
చేతఁ జచ్చెను సుతుఁడని ♦ సిగ్గుఁ బొంది
యెంత మఱపిల్లునో గదా ♦ చింతఁ జిక్కి ''
అనుచు వచియించి గోల్గోలు ♦ మనుచు నేడ్చెఁ
దల్లి నెంచియుఁ దన మృతిఁ ♦ దలఁచికొనియు,
నతఁడు సుతుఁడని నమ్మక ♦ యట్టె నిలిచి
వినుచునుండెను 'రుస్తు' మా ♦ తని నతండు
చెప్ప పేళ్లన్నియును దెలి ♦ సియును గూడ.
కారణం బేమనఁగఁ బూర్వ ♦ కాలమందు
శ్వశురగృహమందుఁ దన కాత్మ ♦ జాత యొకతె
పుట్టుటయెఱుంగుఁ గాని యె ♦ వ్వాఁడును సుతుఁడు
కలిగె ననువార్త సుంతయుఁ ♦ దెలియఁడయ్యె.

పుత్రవాత్సల్యమునఁ దల్లి ♦ ముద్దుబిడ్డ
జనన మొత్తఁగింపఁబడెనేని ♦ జనకుఁ డతని
శత్రుజీవినిగాఁ జేసి ♦ సంగరములఁ
దిప్ప ననుభీతి సత్యంబుఁ ♦ దెలుపదయ్యె.
ఆక్షతంబున సత్కీర్తి ♦ నందఁ గోరి
రుస్తుమున కేన యేకపు ♦ త్రుండ ననుచు
స్వాతిశయమున వెల్లడిం ♦ పఁగఁ దొడంగె
ననుచు రుస్తుము సాలోచ ♦ నాత్ముఁ డయ్యె.
పొంగిపొర్లాడు సాగరో ♦ త్తుంగభంగ
చయము సంపూర్ణపూర్ణిమా ♦ చంద్రు నరసి
యుబ్బి యొడ్డును ముంచెడు ♦ నోజ, నతని
యాత్మసంతాప శోకోర్మి ♦ కాళిముంచె.
పొద్దుపొడువంగఁ గొండపైఁ ♦ బొదలుచుండు
నిజగృహంబున ముంగిట ♦ నిలిచి మిగుల
దవ్వుదవ్వులనున్న ప ♦ త్తనమునొకఁడుఁ
దీక్ష్ణకిరణాతపోష్ణహ ♦ తిందనర్చు
దానిఁ బొరలాడు మేఘమ ♦ ధ్యంబునుండి
చూచులాగునఁ గనియె రు ♦ స్తుము స్వకీయ
యావనంబును, దనకూర్చు ♦ నలరుబోఁణి
తలిరుబ్రాయంబు, నాతని ♦ తండ్రిచూపు

నట్టిపేర్మిమునుఁ, దొంటి హా ♦ ర్మ్యములఁ బురఁ
బుష్పవనములు, నడయాడు ♦ భూధరములు
పర్వమాతనికనుల సా ♦ క్షాత్కరింప.
అప్పుడాతండు తాను బా ♦ ల్యమున మెలఁగి
నట్టి తీరంతయును హృది ♦ యమునఁ దలఁపఁ
గన్నుఁగవ బాష్పబిందు సం ♦ కలితమయ్యె
మఱచికొర్మిమ్రావి లేమొక్క ♦ నఱకుతోఁట
కాపరివిధంబునందన ♦ కన్నకొడుకు
సుందరాకారు సుకుమారు ♦ సుగుణశూరు
"సోహ్రబు" నెఱుంగనేరక ♦ చూఱకత్తిఁ
జేతులారంగ నంగర ♦ క్షితివధించి
నేలఁబడియొంటియుసురున ♦ నిలిచియున్న
వానినెమ్మోము సంతాప ♦ పడుచుఁగాంచి
"ఓయిసోహ్రబ" రుస్తుమే ♦ యుష్మదీయ
జనకుఁడగునేని యానంద ♦ సాగరమున
నోలలాడఁడె ? యనృతోక్తు ♦ లూహఁగొలఁది
రుస్తుము సుతుండవంచు వా ♦ క్రువ్వ నోరులు
నిజముగా నమ్మితివో లేక ♦ నీవె యతని
తనయుఁడ నటంచుఁ జెప్పికోఁ ♦ దలఁచితేమొ
నీవురుస్తుము కొడుకవు ♦ కావు కావు.

అతఁడు సుతహీనుఁ డొకకుమా ♦ రిత యొకలదు
తత్తనూజాత యిప్పుడు ♦ తల్లిచెంత
నుండి గృహకృత్యములొనర్చు ♦ చుండుఁగాని
స్వప్నమందైనఁ దలఁపదు ♦ సంగరములు.”
అనఁగ సోహ్రాబునియాగ్ర ♦ హంబుఁజెంది
యంతకంతకు వేదన ♦ యధికమైనఁ
బ్రాణవాయువులను విడు ♦ వం దలంచె
నాయుధంబును బెఱికి గా ♦ యంబు నుండి.
కాని తానెలరుస్తుము ♦ సూనుఁ డగుట
వానికిం దెల్పి నమ్మించు ♦ వఱకుబ్రదుక
నెంచి మోచేతిపైనాను ♦ కొంచు లేచి
“ ఓరిక్రూరాత్మ! నే బొంకు ♦ చుంటి ననఁగ
వాయెటులువచ్చెనీకుఁ జా ♦ వంగనున్న
జనుల రసనాగ్రములయందు ♦ సత్యమలరుఁ;
సత్యమాడుటయే నాకు ♦ సహజగుణము
గర్భవతియైన నాతల్లిఁ ♦ గాంచి, రుస్తు
మునికిఁ బోయెడు తఱిఁబుట్టి ♦ నట్టి శిశువు
హస్తమున వేయుమంచు నె ♦ య్యమున నొక్క-
ముద్రయిడెనంట యయ్యది ♦ భుజమునందు
కలదు నేఁడును జూడుమా ♦ కల్లగాదు.

నావినిమొగంబున వివర్ణ ♦ భావమూని
జానుయుగ్మంబు నిలుకడ ♦ సడలియూఁత
గుండియలఁ జేతులనునైచి ♦ కొనుచు బాష్ప
రోధమునఁజెడఁ గంఠంబు ♦ రుస్తుమనియె
"నిజము సోహ్రబ! నీమాట ♦ నిశ్చయంబు
ముద్రితభుజంబునాకుఁ జూ ♦ పుదువయేని
సత్యమనినమ్మెదను నిన్ను ♦ శంకదక్కి"
అనఁగఁ జొక్కాయి సడలించి ♦ యతిరయమున
భుజమునందలి యారక్త ♦ ముద్రఁజూపఁ
బనితనంబునఁ గడుమేలు ♦ బంతియైన
శిల్పకారుండు తనరాజ ♦ శేఖరునకు
పాయనమొనంగుటకుఁ గాచ ♦ పాత్రమొకటి
కచ్చితంబుగఁ బ్రత్యూష ♦ కాలమందుఁ
బవటివేళను సంజను ♦ దివియచెంత
విసుగులేకుండ నధిక సం ♦ ప్రీతిఁజేసి
చెందిరంబునదానిపైఁ ♦ జిత్రరచన
నెంతయందంబుగ రచించు ♦ నంతయంద
మునుఘటించుచు సోహ్రబు ♦ భుజమునందు
నలరె రుస్తుముద్రము ♦ ద్రాంక రేఖ.
అపుడు సోహ్రబుకన్నుల ♦ నశ్రులుగల

జల్లుకొనఁజొచ్చెఁ గన్నీరు ♦ వెల్లువయ్యె
నంతరుస్తుము చేసంది ♦ యాయుధంబు
నాత్మహత్యకుఁ దొడగుట ♦ యరసి సోహ్రి
బతని కరమును దనచేత ♦ నదిమిపట్టె
"తండ్రి! దుఃఖింపఁబోకుము ♦ తాళుకొనుము
యింతదనుకను దండ్రి వం ♦ చెఱుఁగనట్టి
నీకరంబున మృత్యువు ♦ నాకుఁగలుగు
నంచు విధి వ్రాసె నే నుద్భ ♦ వించినపుడె
తప్పునా బ్రహ్మవ్రాయు వ్రాఁ ♦ తలు జగాన
మొదట నినుఁ గాంచినప్పుడే ♦ యుదయమయ్యె
వింత యనురాగ మది నీకుఁ ♦ గొంత కలిగెఁ
గాని దురదృష్టవశత సం ♦ గర మొకండు
కలిగె మనకిట్లు, నీచేతఁ ♦ గంటిఁ జావు
నైనదానికిఁ జింతింప ♦ నగునె యికఁ
దీనిమాటను దలపెట్ట ♦ మానుతండ్రి!
ఎవనిఁజూడంగ నెన్నియో ♦ యిడుమలొంది
వెదకివేసారి దేశంబు ♦ విడిచివచ్చి
వీరవేషంబుఁ గైకొని ♦ పృథివిఁగల్గు
శూరులను బోరికిం బిల్చి ♦ పోరుచుంటి
నట్టి జగదేకశూర సిం ♦ హంబు, నన్నుఁ

గన్నతండ్రిని గన్నులఁ ♦ గాంచఁగంటి
నింతకంటెను సంతోష ♦ మేదకలదు?
చాలు నీజన్మమున మన ♦ శ్శాంతిఁగంటి.
వచ్చి నాచెంతఁ గూర్చుండి ♦ వత్సలాత్వ [illegible]
మెనయ నిరుగేల నాశిరం ♦ బెత్తి, గౌడ
పాళిముద్దాడి కందోయి ♦ బాష్పవారి
జలకమాడింపుమో తండ్రి! ♦ సత్వరముగఁ
బిల్వుమా 'సోహ్రబా' యని ♦ ప్రేమతోడ
నన్నుఁ గడసారి నోరారఁ ♦ గన్నతండ్రి! [illegible]
ఆలసింపకు మృతి దగ్గ ♦ అగుచు నుండె.
మెఱపు తెఱఁగున రణసీమ ♦ కుఱికినాఁడ
కదలి చనుచుంటి నిందుండి ♦ గాలి లీల
దేవునాజ్ఞను దలఁ దాల్చి ♦ ధీరమతిని."
అనిన పిమ్మట 'రుస్తు' మ ♦ త్యంత శోక [illegible]
హృదయుఁడై యెక్కపెట్టిన ♦ నేడ్వఁ దొడఁగెఁ
గొడుకుపైఁబడి బాహువుల్ ♦ మెడను [illegible]
పెదవులను జెక్కిళులు ముద్దు ♦ వెట్టుకొనుచు
నట్టియెడఁ జూచి యెరుమోన ♦ [illegible]
దత్తఱంబున రుస్తుము ♦ తత్తడియును [illegible]
బరుగుపరుగున డాయంగ ♦ వచ్చె [illegible]

నేలఁ జీరాడఁ దలవాంచి ♦ నెమ్మిఁ దక్కి.
కనుల బొటబొట నీరంబు ♦ గాఱి యిసుక
పేరుకొన వారి రోదన ♦ కారణంబు
నరయుచుండె ననంగ ని ♦ ర్వారను జాలి
గొలుపు చూపులఁ గనుచుండెఁ ♦ బలువితముఁ.
అపుడు రుస్తుము స్వీయవా ♦ హనముఁ జూచి
"ఓసియశ్వమ! దైన్యంబు ♦ నొందుచుంటి
వంతయును నైన పిమ్మట ♦ నకట! యుద్ధ
భూమికి న్నన్నుఁ గొని రాక ♦ పూర్వ మీవు
కూలవైతివి దురదృష్ట ♦ మేల తప్పు?"
అనుట సోహ్రాబు విని "తండ్రి! ♦ యస్మదీయ
మృతికిఁ జింతిల్లు నశ్వంబు ♦ నేల గదుమఁ
దురగరాజము! విశ్వాస ♦ పరతఁ బెక్కు
వర్షములనుండి నాతండ్రి ♦ పాలనమునఁ
బెంపుఁగంటివి సంగ్రామ ♦ విజయకీర్తి
నిన్నుఁగూడిచి నాతల్లి ♦ యెన్నుచుండు
నెల్లవేళల నట్టి ని ♦ న్నిచట నేఁడు
తండ్రితోఁ గూడఁ గనిధన్య ♦ తముఁడ నైతి.
దరికి రమ్మొక్కసారి చేఁ ♦ దట్టి నిన్ను
నూఱడించెద విలపింప ♦ కుండుమనుచుఁ

బోగులనేట్టికి ? నాకంటె ◆ మిగుల బుజాస్త్ర
మూర్తి నీయది యేలనః— ◆ బోయియుంటి
వెన్నఁడును నాకుఁ జూడంగ ◆ నేగనేర
నట్టి సీమలకీవు, నే ◆ పుట్టుటాది
యెఱుఁగని మదీయజనకుని ◆ గృహముఁ గాంచి
యుంటి వక్కట ! మందభా ◆ గ్యుండ నగుటఁ
జూడఁజాలక ప్రాణము ◆ లీడ్వుచుంటి ;
సంచరించితి వల్ల ‘సై ◆ స్థాను’ దేశ
సైకతస్థలులందు ని ◆ చ్చలును గ్రోలఁ
జాలితివి గాదె ‘హెల్మ్రండు’ ◆ జలము, సొంపు
గాంచు ‘జిర్రా’ సరస్సు నీ ◆ క్షించితీవు.
తాత స్వయముగ బంగారు ◆ తట్టలోన
లేఁతపచ్చిక మేఁతఁ గ ◆ ల్పించి నిన్నుఁ
జేతఁ దట్టుచుఁ గారుణ్య ◆ చిత్తుఁ డగుచు
నశ్వరాజమ! రుస్తుము ◆ నహరహంబు
వేడ్క భరియింపుమా,” యన ◆ వింటివీవు.
నాపితామహు మోము నె ◆ న్నఁడు నెఱుంగ
నతని ‘సైస్థాను’ నందున్న ◆ హర్మ్యమైనఁ
గాంచలేనైతి, ‘హెల్మండు’ ◆ గంగ గ్రుక్క
నైనఁ గ్రోలంగలేదు దా ◆ హంబుతీర.

తండ్రి నెఱుఁగక యతనిశా • త్రవులలోనఁ
గలసి 'సామరఖండాది' • గలుగు పురము
లారసితి 'టర్కుమనుల' వేశ్మ • వాటములను
గంటి, నదుల 'టిజెంతు ము • ర్ఘాబ్ కాస్పియను
నీరు' మొదలైన వాని నీ • క్షించినాఁడ
నాక్సుసనదీమతల్లిఁ గ • న్నారఁ గంటి
దానియొడ్డున నుకణ మొం • దంగనుంటి."
అనఁగ రుస్తుము విని మూల్గి • యనిక దుఃఖ
భరముచే నొడలెఱుఁగక • వనవివనవి
"ఆక్ససు తరంగిణీ! ముంపు • మమ్మ నన్ను
బ్రదికి క్రిమ్మఱి భూమిపైఁ • బడకయుండ"
అనుట సోహ్రాబు వినియిట్టు • లనియెఁ దండ్రి!
బ్రదుకవలయును నీవు చా • వంగవలదు
పుడమిఁ గొందఱు ఘనకార్య • ములను జేసి
మాన్యులగుదురు మఱికొంత • మంది పుట్టి
యేప్రతిష్ఠయు లేక పె • క్కేండ్లు బ్రతికి
చచ్చుచుందురు గావున • జగతి నీవు
బ్రదికి చేయఁదలంచు కా • ర్యములనీవు
గలిపి నేఁబొందఁగోరిన • సద్యశంబుఁ
గనుము, జనకుండ వగుట నీ • కాంచుకీర్తి.

యదేర్లయగు, నాయగ ♦ న్యాయమగుసేనఁ
గరుణఁగను తండ్రి! నాకెంటఁ ♦ గదలివచ్చె
ప్రీతాపంబు నాకీర్తి ♦ నమ్మికొనుచు,
వారిఁజంపను ప్రార్థించు ♦ వాఁడనిన్ను;
తకును వారియపకార ♦ మేమికలదు?
దయవహించి యాక్సనునది ♦ దాఁటనిమ్ము
జనక! కొనిపొమ్ము నన్ను సై ♦ స్థానుదేశ
మునకునీతోడ వారితో ♦ ననుపఁబోకు
మచటనొక సాన్పుమీఁదఁ జే ♦ రిచి మదీయ
మృత కళేబరమును భీమ ♦ మిగుల నీవు
స్నేహితులఁగూడి నాతాత ♦ చెంతనిలువఁ
గొంత సేసేడ్చి నాస్మృతి ♦ కొఱకుఁ బిదపఁ
బావనస్థలిఁబూడ్చి యా ♦ పైననొక్క
యున్నతస్తంభ నిర్మాణ ♦ మొనరఁజేయు
మదికనుంగొని దవ్వుల ♦ నరుగునాశ్వి
కాళి "యల్లదె లోక వి ♦ ఖ్యాతవీరుఁ
డైన రుస్తుము కొడుకు సో ♦ హ్రాబును దెలియ
కాజిఁగూలిచి పూడ్చిన ♦ యట్టిసీమ
యనుచువాకొనుచుండుదు ♦ రనుదినంబు."
అనుచుఁ గొమరుండు వచియింప ♦ జనకుఁ "డట్లె

చేయుదునులేర నాతండ్రి! ♦ వాయుగతిని
బోయి నావేశ్మమంటింతు ♦ బుగ్గిగాఁగ,
సమరభూమిని విడనాడి ♦ చనెదఁగాక!
యిపుడె శైస్థానునకు నిన్ను ♦ నెత్తికొనుచు.
అచట నిన్నొక పాన్పుపై ♦ నధివసింపఁ
జేసి ముదుసలి తాతయు ♦ స్నేహితులును
నేను, నీపజ్జకుంజేరి ♦ నిన్నుఁగూర్చి
వేఁడికన్నీరు నింతుము ♦ పెక్కువగలఁ
దండ్రి! నీస్మృతిచిహ్నమై ♦ తనరునట్లు
చాలదూరంబు గన్పడు ♦ స్థంభమొకటి
నిలిపి శాశ్వత మొనరింతు ♦ నీసమాఖ్య.
నీదళంబుల విడిచెద ♦ నిక్కువముగ
నదినిదరియించిపోవ ని ♦ చ్చెదనుమరల,
వారిఁజెండాడి నేఁజేయు ♦ పనులు నేఁడు
కానరావేమియును నీవు ♦ కలవుగాఁగ.
దురమునందున నేమున్న ♦ తునిమినట్టి
బిరుదుమగలెల్లనేఁడు జీ ♦ వింతురిగాక!
ఏరిఁగెడపుటఁ గంటినో ♦ శూరకీర్తి
పట్టివీరాధివీరు లి ♦ ప్పట్టునందు
నిదురమేల్కొన్నయట్లులే ♦ చెదరుగాక!

ఁసామాన్య మానవా ♦ కృతివహించి
యూరుపేరుగడింపని ♦ వీరభటుండ
య్యెదనుగాక ! నేనట్టు ♦ లగుదునేని
ంబూవు ప్రాణంబుతోనుందు ♦ వేమొతండ్రి :
అట్లుకాకున్న నేనె యా ♦ హవమునందు
మృతుండనై రక్తసిక్తమౌ ♦ నిసుకనేలఁ
గూలిపడియుండ నీజన ♦ కుండ నటంచుఁ
దెలిసి నాకొఱకీవు చిం ♦ తిలెదుగాక !
సీకరంబున నేమర ♦ ణింతుఁగాక !
నీవు నాచేతఁ జాకుండ ♦ నిహతునన్నుఁ
బూడ్చెదవుగాక శైస్థాను ♦ పురమునందు.
అపుడునాతండ్రి హతుఁడైన ♦ యాత్మజాతు
నన్నుఁగని " పుత్ర ! నీమర ♦ ణమునకాత్మ
నంతశోకింపఁ, జిరకాల ♦ మందె యిట్టు
లెన్నఁడో నీవుచత్త్వం ♦ చెఱిఁగియుంటి "
ననుచు దుఃఖించుఁ బుత్రినో ♦ హమునఁ గొంత
జవ్వనంబాదిగామేటి ♦ సంగరముల
జీవహింసాభిరతిఁజరిం ♦ చితిని, బ్రదికి
నంతకాలంబునదియె సం ♦ ప్రాప్తమయ్యె
జన్మమునకింక సౌఖ్యం లే ♦ శమును లేదు! "

భూల నంద్గంధు పెదచల్లి ♦ గోలవెట్టి
యెవరిదారినివారు వో ♦ యిన, సుమంబు
లెండవడఁదాఁకి వాడిపో ♦ యిన వితాన
సోహ్రాబు శరీరమంతయు ♦ సుర్క్కి, సుత్త
మ్మాంగమదికుర్రిఁగెఁ జైతన్య ♦ మడఁగిపోయెఁ
గనులు మూఁతలువడె, శ్వాస ♦ ముసు గతిఁదప్పఁ
దొడఁగె, నయ్యెడ నోడలెల్ల ♦ వడఁకె మఱలఁ
గదలికను గాంచి యాతఁడు ♦ కనులువిచ్చి
య్యెదుట నుండిన తండ్రిపైఁ ♦ గృపణదృష్టి
నిలిపెఁ పదపడి యవయవం ♦ బులకు బలము
క్షీణమగుచుండ సోహ్రాబు ♦ జీవుఁడపుడు
తా వసించిన దివ్యసౌ ♦ ధమును, దాని
జవ్వనంబును నిహలోక ♦ సౌఖ్యములను
దలఁచి పొగులుచు విడియుండఁ ♦ గలనె యనుచు
వెనుక చూపులు చూచుచు ♦ వెడలిపోయె.
అంతరుస్తుము గతియించి ♦ నట్టిసుతుని
మొగముపై నొక్క వస్త్రంబు ♦ ముసుఁగువైచి
చెంతఁ గూర్చుండె విడువని ♦ చింతఁదగిలి
యాపుడు సాయంసమయమయ్యె ♦ నడరియిరువు
జనకపుత్రుల నారెండు ♦ సైన్యములను

నాపరించెను, గడుదట్ట ♦ మైన మంచు
వెడలె నిండోలగము వెలు ♦ వడెననంగ.
ఇరుపళంబులవారుఁ గ్రి ♦ మ్మరుజి నిజాల
యములఁ జేరిరి, నదియొడ్డు ♦ నందు వింత
కాంతులీనుచు మంటలు ♦ కానవచ్చె
వారు భుజియించి చలిబాధఁ ♦ బాపుకొనఁగ
రగులఁజేసి రనంగఁ దా ♦ ర్తారుతెల్ల
నాకసనుసవ్రివంతియొడ్డున ♦ నారగించి
రల్ల పారసీకులు దక్షి ♦ ణాశ నున్న
యిసుకబయలున భుజియించి ♦ రింపు గదుర
సోహ్రిబును దండిగ్రి నొంటరి ♦ చోట విడిచి.
అన్నదీరత్న మచ్చోట ♦ నమిత జలస
మృద్ధిఁ బెకేంల్ల తనరారి ♦ యిచ్చవచ్చి
నట్టులు విహారసౌఖ్యంబు ♦ లనుభవించి
మధ్యమలలను నాపద ♦ లమ్మలసియాడ
మలఁకలం గొని యిసుకతి ♦ ప్పలను బలిసి
యంత సన్నని త్రోవల ♦ నల్ల నల్ల
నూర్మికావళి నుప్పొంగు ♦ నుదధిలోనఁ
గలసి శాశ్వత విశ్రాంతిఁ ♦ గాంచి మించె.

సంపూర్ణము.

బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి వేంకటేశ్వర కవులు గారి

అభిప్రాయము.

ఉ॥ చక్కని నీతిపద్యములు ♦ సాగతరంగములుగా మర[illegible]ప్రసా
హక్కులు జాలువారు నది ♦ 'సో[illegible]బంధ' నామకమైన స్తోత్రపుం
జక్కను జూచితిన్ చదివి ♦ చొక్కితి నో హనుమంతరాయ! ని
ఫక్కికిఁ గైతయందుఁ బరి ♦ పాకము కల్గెను నాఁడు నాఁటికిన్.

చ॥ కథ గనవత్తరం బయిన ♦ కల్పనతో మను పురాణభావలో
[illegible]ఁడు రచించె దీని కొక ♦ పోలిక లేని తెలుంగులోనను
గ్రథితము నిల్పు చేయుటయె ♦ కష్టము కావున నీకవిత్వ దృ
క్పథమున నిట్టి కావ్యములు ♦ పొల్పడుఁ గాత జగంబు మెచ్చఁగన్.

తే॥ పదములకొందిక బాలురు, చదువంగాఁ దగిన మంచి ♦ శైలియుం రసముం
గుదిరిన పాత్రము తగిన, ట్టిది యిది మన యూనివర్సి ♦ టీ చదువరులకున్.

మ॥ పరమానందచరిత్రి మున్నయిన క ♦ బ్బంబుల్ రసాఖ్యాయికల్
పరమానంద మొనర్పఁజాలిన వాన ♦ ర్పంజాలి తీ వెన్నియో
పరను తెచ్చెడి సత్ప్రబంధముల ని ♦ చ్చల్ చేయుచున్ జాడితా
దరముం గాంచుచుఁ గీర్తికాంతను దిగం ♦ తశ్రాంతిఁ గాఁ జేయుమా.

క॥ మోచాఘలోపమిత మృదు, వాచా! హనుమంతరాయ! పరమ[illegible]!
మోచెర్లకులాంకూరమ!, యాచార్యుఁడ వగుము పండి ♦ తావళి కరుణన్